

శ్రీమధుసూదనాయనమః. 13

# అంబరీషోపాఖ్యానము.



1 శ్రీధవుడగుమాధవు నెల్లప్పుడు◆చిత్తమందునునిచి
గణనృపసత్తమువినుతించి
పలుకులవెలదిని ప్రార్థించి
గౌరిసమేతుండగు శంకరుపద◆కమలములకునారగి
కవిసత్తముల హృదయమెరిగి

2 చదివెడిపిల్లలు మహార్నవమికివి ◆ జెప్పుకొనెడియట్లు
వినుజను లహాహాయనునట్లు
నవరసములు నొలికెడియట్లు
భక్తిమీరగా రచియించెదహరి ◆ భక్తునిచరితంబు
భవభయసంకటభంగంబు

3 ఇనవంశంబున నాభాగుండను ◆ జననాథునిసుతుడు
మునివరుపూజసమాన్వితుడు
సుగుణంబులకునాలయుండు
అంబుజనాభునికిని భక్తుండౌ ◆ అంబరీషుడిలను
సురదారనుంబలె మెలగుచును

4 సప్తద్వీపాక్రాంతంబగు భూ ◆ చక్రముపాలించు
ప్రజలనుబిడ్డలవలెగాంచు
ద్విజులనుజూచివందముంచు
ధర్మముదప్పక నాల్గుపాదములు ◆ ధరణిని యీరీతి
నేలుచునుండెను బహుఖ్యాతి

5 చిత్తము శ్రీహరియందు జేర్చి వా॥శిష్టుడు మొదలైన
ఋషులతో గూడిగణ్యమైన
జేసిన నథుహారంబులైన
నశ్వమేధములు జేసె పెక్కు సారస్వతితటమందు
గృంకినకలుమహారమునందు
6 మంటిగడ్డ బంగారము రెండు స॥మంబుగమదినెంచి
అఖిలముహరియందుననుంచి
తనమదిహరిసేవినుగించి
ఘనుడగునృపసత్తముడు రాజఋషి॥యనగవెలుగుచుండె
సురలేపొగడగ దివినుండి
7 హరియని యేనాఘ్రాణించును శ్రీ॥హరియేయని తాకు
దినుటకుహరియేయనిపల్కు
ప్రజలతో హరియేయనువిూకు
హరియుదప్ప వేరొక్కటిలేదని॥అంబరీషుడనును
ఎంచునుహరినేమనమునను

8 అతనిసుగుణముల లెక్కవెట్టనల • చతురాననుకైన
కాకోదరపతికినైన
గీష్పతిబృహస్పతికైన
వలనుపడవ్రయనె సిరీతియాతడు • వసుధనుపాలింప
వెలగెనుజగతిసంతసింప

9 ఈరీతిగపాలింపగమానెను • యిచ్చవసుధయందు
గజరథసముదాయములందు
వాజులమొత్తంబులయందు
పుత్రమిత్రసత్పౌత్రులయందును • భోగంబులయందు
ధనమణిసంచయంబులందు

10 సంసారాంబుధితగులంబును తా • చయ్యనవిడదీశి
బహువిధ సంపదలనురోశి
హరియందలరుభక్తిజేసి
సొకడేయగుచునుధ్యానముహరియని • నొవ్వగజేయకమను
నుండగ శ్రీహరిమనమునను

11 నాభక్తుండౌరా శభాషుయని♦నాత్మలోనదలచీ
సుజనసురక్షణమనియెంచీ
రిపుజన వక్రింబనిమించీ
· తనుదాల్పెడిచుట్టుకైదువును నా♦తనిరక్షణకిచ్చె
దివిజజనంబునిచ్చమెచ్చె

12 అంతటభూకాంతుడు సంతసములో♦నాత్మమహిషితోడ
ద్వాదశివ్రతముసేయుజాడ
దెలిపియు నేటిదరికిగూడ
జేరిమాధవుని గూర్చివ్రతంబును♦జేయగమొదలిడిరీ
భక్తాగ్రేసరులనుమీరీ

13 యీకరణిగజేసివ్రతాంతంబున♦యాకార్తికమందు
దినములు నొకటిరెండునుందు
మనుచునుమాధవుమనముందు
దలచియునుండిరి నుపవాసంబులు♦ధన్యగుణమహాత్ముల్
శిరివరుదలచుచుండుచరితుల్

14 తేకువతో నుపవశించి కాళిం॥దీజలములమున్గీ
హారినభిషేకించియుపొంగి
పూవులగంధంబులనింగీ
దేవదుంధుభులు మేల్ భళియనగా॥ దేవునిపూజించీ
మనముకు సంతోషముకునించీ

15 గారవమున నుద్యద్వాదికులకు॥ క్షీరంబులు పిండు
రజితపుగొరిజలతోనుండు
కనకపుశృంగంబులగండు
మీరియున్న నర్బుదాలమందల॥ మేదినిపతియొసగె
తదనంతరము యిటులజరిగె

16 భక్ష్యభోజ్యచోష్యాదికములతో॥బాహ్మణోత్తములకు
విద్యల కాటపట్టుప్రజకు
మహాతప మునిగణోత్తములకు
విందులొనర్చియు తృప్తిపరచిగో॥విందునిభక్తుండు
మాధవునలచుచు మరిమెండు

17 పారణసేయుట కుద్యోగింపగ ♦ భాసురవర్యుండు
నిగమపదోపన్యాసుండు
అనుపమయోగాభ్యాసుండు
రవిభాసుండౌ దుర్వాసుండౌ ♦ రాజసన్నిధికిని
వచ్చెనుసంతసింపమదిని

18 తటుకునవచ్చిన మునిసత్తము కుచి ♦ తాసనంబమర్చి
తగువిధిపూజలచేపేర్చి
పాదద్వయమునొకటిజేర్చి
తోయంబులతోగడగియు సేమము ♦ తోరముగానడిగీ
అన్నముగుడువమనియుగడగీ

19 నమస్కారములుపెక్కులొనర్చిన ♦ నామునివర్యుండు
సంతసముతో జెలగుచునుండీ
వల్లెయని బాగనుచుండి
కాళిందీజలముల గ్రుంకుటకై ♦ కడువడిజనెమునియు
మనమునవేరొకవిధమనియు

20 ఆవిధిజలములలోఁగ్రుంకియుబహు॥సావధానమతుఁడై
అతియగుధ్యానసమాగతుఁడై
వ్రతమునుభంగపరుపగలఁడై
మునిగిమునిగి రాకతడవుజేసిన॥మనుజాధిప బుధుడు
ఉత్తముడంబరీషనృపుడు

21 కాలముమించును పారణంబునకు॥వీలుదోఁచదాయె
మునియును నీరువెడలడాయె
తాపసవర్యుండేమాయె
ననిచింతించియు విద్వజ్జనముల॥నాదరమునబిలచీ
యిట్లనిదీనతవచియించె

22 తాపసోత్తముడు స్నానముజేయగ॥తటినిచేగిరాడు
ద్వాదశిపారణయునుజూడ
మించుచునున్నదినాఁడ
వచియింపుడు నర్వమైనపనినో॥విప్రోత్తములారా
శ్రుతులలోనలువకునములారా

23 అనియనవాబుధ సముదయమిట్లనె • నంబరీషుతోడ
నిర్మలధర్మచరితుతోడ
శ్రీహరిభక్తవర్యుతోడ
అతిథిరామిచే ద్వాదశి పారణ • నాపబాడిగాదు
నీరమునారగింపుసాధు

24 అనివిప్రులుమదిగల సందేహము • నరత్పటిలో బాప
నృపఋషిమధురిపునుదినిలిపి
సలిలముభక్షణంబుసలిపి
అననెదురుచూచుచునుండెనుదు • ర్వాసునిగమనంబు
కేశవదాసుడుమార్గంబు

25 దుర్వాసుండాయమునానదిలో • తోడరిగ్రుంకులిడియు
రాజునుజేరి నతిథివిధియు
పూజలునృపవరుచేగనియు
అంబరీషుడొనరించినయట్టి యు • దంతముంతయూని
నెరిగియు నాగ్రహముచుబూని

26 బొమముడిమొగముతో నదరెడిమేనితో♦బాగుగకోపించి
కనులలో నిప్పులురులగాంచి
ఆకలిచే నృపు రెట్టించి
నీదురహంకారునిగంటిరెయని♦నితరులతోననుచు
నాపనచూపిదయిదెయనుచు
27 కుడువగరమ్మనిననుముందరతను♦గుడిచెనుమూర్ఖుండు
ఎటులౌ శ్రీహరిభక్తుండు
బహువిధములదుష్కర్ముండు
నాదగుశౌర్యముచూపించెదరా♦నరాధమా నీకు
కనలిన నెదురెవ్వరునాకు
28 పెటపెటదంతంబులు గీటుచుతన♦జటమొదటికిబెరికి
కాలుండోయన నృపుమదికి
దోచియు హుంకరించిపైకి
కేలపదంబులు ద్రొక్కుచుజనియెను♦నిమిషమాత్రిలోన
రాజర్షియునుభీతినూన

29 యీవిధమంతయు సదయహృదయుడౌ♦యావిశ్వంభరుడు
సెరిగియుతాపసాధముండు
దాసునికిని జేశెడిదుండ
గమునుచక్రగాసవరింపుమయని♦కరసుదర్శనమును
బంపెనుమునిమదమణపగను
30 ప్రళయాంతముగావచ్చెననంగా♦పడెనుల్కములనగా
సురలతిభీతినొందిరనగా
ననలముమిన్నుముట్టెననగా
మంటలుమండుచువచ్చిమునీందుని♦తుంటవసులుమాన్పి
యాతని వెంటదగులజొచ్చె
31 మానీశ్వరుడును భయాకాంతుడై♦మేరుగుహాలొజొరగా
నదియునుమేరుగుహాలొజొరగా
భువిలోకొంతతడవుబోగా
గోవును వెనుకొనుకోడెమాదిరిగ♦క్షోణిజొచ్చెనదియు
నృపునకు సంతసింపమదియు

32 మునివర్యుండటకేగిన చక్రము • వెనువెంటనటకేగు
నిలచిననిలుచును వేవేగ
పోయినపోవును తొందరగా
దివిక్రాకిన దివిక్రాకును జలమున • దిగినదిగును జనటియు
యీవిధివగిలె వెంటమరియు

33 సక్రోధంబున వెంటబడెడివారి • చక్రంబును గాంచి
ఎచ్చటికేగినరక్షించు
వారును లేరని యోచించి
పద్మభవుండగు బ్రహ్మదండకా • పద్మగర్భుండగుదు
జనియిట్లనె దీనుండగుచు

34 కమలోద్భవ నను గావుము కైదువ • గ్రమ్మరించియువగా
అతడిట్లనియెను భీతిలగ
హరిచక్రంబును ద్రిప్పంగ
శాతరంబుగాదో మానీశ్వర • నాలకింపుమదిని
చెప్పెడుమాటలవియుకొన్ని

35 భవుడింద్రాదులుదక్షుండేనును•ప్రజాపతులుభృగుడు
భూతాధిపతులుసూర్యుండు
మునినేత్రుండగుచంద్రుండు
చక్రాధిపతో శ్రీహరియాజ్ఞను•శిరమునదాల్తుముగా
దీనినిమరలింపనువేగా

36 అనవిడచియటదుర్వాసుడుకై•లాసంబునకొచ్చి
ఉమతోగూడినభవుగాంచి
వందనములనుసమర్పించి
వేయంచులకైదువజ్వాలలుయా• వేదవేద్యకెరుగా
చెప్పినశంకరుడిటులనెగా

37 వినవయ్యాచెప్పెదనొకమాటను•ఏనుదేవలుండు
నారదుడజుడుమహేంద్రుడు
ధర్ముడుసనత్కుమారుండు
కపిలుండును నిర్జరులుసిద్ధులును•గాన[illegible]
తరమాతనిచక్రముద్రోయ

38 గాననీవు శ్రీ హరినికటంబునకు • కడు వేగముగాను
బోయియు వందనములతోను
వేడియు కరుణనురాగాను
జేసినయాతడు దీనదయాళుడు • చక్రంబునుది ప్పా
గాచియుమాన్పు మునీముప్పు
39 అనినశంకరునియాశవిడచిముని • యల వైకుంఠముకు
మోక్షముమూలమైనపురికి
ఉత్తమజనముల పెన్నిధికి
యిందుశిలానిర్మితమైతగు గో • విందుపురికిజనెను
చేతము భీతిమునుంగగను
40 అటుజనిరమతో గూడినమాధవు • తటుకున గనిమునియు
యీయన కేమిజెప్పదనియు
జేరియొనర్చెదండమనియె
నీదగుచక్రానలజ్వాలలు నా • మీాదప్రజ్వరిల్లె
నీవేకావుమనుముతల్లి

41 నీమహిమంబిసుమంతగానకను♦ నేనతిమూర్ఖుఁడనై
మదమున క్రొవ్వినవాడనునై
తెలియనిమూఢచిత్తమతినై
కానకజేసితి తమభక్తునకప♦కారముమహా దేవా
పదములబడితిని నిదెబ్రోవా
42 యీావిధిహరిపదములపై నొరిగియు♦ లేవకుండగాను
కరమున నెత్తియు నిట్లనెను
మిక్కిలిసంభ్రమంబుతోను
నాభక్తుడునాదుమేలుగోరును♦ తాపసవర్యుండ
వారికినేబరమాప్తుండ
43 తనువుమనువువిడచియుచుట్టాలను♦ తానీకమువిడచి
సంపదదశలెల్లనువిడచి
భార్యనుగూడవిసర్జించి
నన్నునెల్లకాలములజపించుచు♦నున్నవారినేను
విడువను నెట్టివారికైన

44 పంచేంద్రియములు మనములో విసర్జించియు బంధములు
ననుస్థాపింతురుమానసులలో
స్మరణనుజేయుదురిలకలలో
మంచివరునిపుణ్యాంగనజనములు • మరగినమాదిరిగా
సాధులహృదయమునాయదిగా

45 నాచిత్తము సాధులహృదయంబుల • నాట్యమాడుచుండు
మనసులు నన్నే మరిగుండు
నాయదివారినిమరిగుండు
గావున వారికి సద్గోచరించిన • కనినామదియుండు
తెలిపెదనింకనువినుమందు

46 నా తేజము సాధులహృదయంబుల • నాతతమైయుండు
వారినికలచుజనులకుండు
చేతోమోహముచెడియుండు
శ్రుతిగలుగునదెపోవిప్పుడ నా • భాగునిపుత్రుండు
అభయంబొసగున్నవపరుండు

47 అనిపురుషోత్తముడానతివ్వగా॥ అంబరీషుడప్పుడు
దండకుచక్రపుమగ్నుండు
మునివరుడుదితస్వాంతుండు
నిర్విశానదుర్వాసుడుజనిధర॥
బట్టియువిడువకుండగాను




48 చరణస్పర్శనమునకోడుచు శ్రీ॥ చక్రిశిష్యుడపుడు
కరుణారససమాన్వితుండు
సాధులలోసత్తముండు
తనమనమునచక్రమునునుతించెను॥ తగువిధంబుగాను
దేవతలెల్లపొగడగాను

49 పావకుడవుభానుడవుచంద్రుడవు॥ బ్రహ్మంబునునీవ
జలమాకాశపృథ్వీనీవ
భూతేంద్రియనికరమునీవ
యజ్ఞంబునుసత్యంబునుఫలలో॥ కేశులనగనీవే
సర్వాత్మయుకాలమునీవే

50 భువిపై వేబహుక్రతువులఫలమగు♦ భోజివియునునీవే
నిత్యముయాదితేజమీవే
శమధర్మంబులనగనీవే
చక్రిచేతబహుమన్ననబడశైశి♦ చక్రమునిగావు
మ్రొక్కెదచాలునుయికబ్రోవు
51 నిద్రబోవకలలోనగుపడగను♦ నిన్నుగాంచినసుజల్
వేగినకులసతులగుభార్యల్
ఏడువగుండెలుబహుబ్రిద్దల్
గాగనుపెద్దగునిద్దురవోవగ♦ గావించెడినీదు
మహిమనువర్ణింపగరాదు
52 అనియీవిధముగచక్రిస్తోత్రము♦ నంబరీషుడునిచి
కరద్వయినొసటికిముకుళించి
యిట్లనెహరినిమనమునుంచి
దండంబొనరుతుపుణ్యసేతువుకు♦ దైత్యహారణమునకు
విమలంబైనరూపమునకు

53 మరియిట్లనసేధర్మమునందున♦మెలగుచుందునేని
ద్విజుడేదైవంబగునేని
మనసౌయర్థమిత్తునేని
యీవిప్రునకలవడినకష్టమది♦యిపుడెతొలంగును—
మనమతిధైర్యమునందునుగా

54 నేజేశెడికాలఃవుల చేతనుహాః♦నిఖలశుభంబులచే
మిక్కిలిచేతోమోదము చే
నుండినయిపుడీచక్రము చే
గలిగెడిబాధతొలంగుంగావుత♦కంజాక్షునికృపను
మునికినికనులపండువుగను

55 అనియీవిధమున స్తవమొనరింపగ♦యారక్కనగొంగ
నృపుడరెమేల్పళియనిబొంగ
క్షేమనిదివిసురలనంగ
మునికేబాధనుమూడజేయుకను♦మురహరుదరికేగె
నిభుకీర్తియునిండగనింగి

56 యిటుజనమునిమెలమెల్లగధరణీ♦విభుతగదీవించి
యిట్లనెసంతసంబుమించి
నాదగుశోకమాలకించి
కరుణగాచితిమరల్చిచక్రమును♦కాశ్యపీశమౌళి
వేరొకరుండరునినుబోలి

57 శ్రవణంబుననెవ్వనిదొకనామము♦నవరణగాబడిన
బాయునుసర్వపాపములను
మిక్కిలిసద్వృత్తముడాను
అట్టిమాధవునిభక్తులకెందును♦నడ్డంబును లేదు
నేరునుతుల్యమనగరాదు.

58 నేజేసినతప్పునుమదినెంచక♦నెనరుంచితివీవె
పోయినప్రాణినిల్పితీవె
వ్రతపరిపూర్తి జేశితీవె
నీకెల్లప్పుడుమేలుదలంచెద♦నేబోయెదరాజా
సద్గుణరవిభాసురతేజా

59 అనవిని మ్రొక్కియుపార్వతి తేజుం♦డానందముతోడ
మునికిని భక్ష్యంబులతోడ
గోఘృతశాకంబులతోడ
భుజియింపగ బెట్టిన భూసురుడును♦బొందిసంతసమును
భూనృపవర్యునికిట్లనెను

60 గంటినిన్ను నీచరితము వింటిని♦దింటిని అన్నంబు
త్రావితి కాళిందిజలంబు
స్వర్గపు సురసముదాయంబు
మర్త్యజనంబులు నిన్ను న్నుదురో♦మానవాధినాథ
జనెదనుధర్మగుణప్రబోధ

61 అనిదీవన జేసియు దుర్వాసుడు♦వనజోద్భవుపురము
జనియె నృపేంద్రుడు సంబరము
నొందియు మునిబోయెడి కాలం
బునకువత్సరము నిండి వ్రతము పరి♦పూర్ణంబగు కతన
తినెనోగిరము సంతసమున

62 మునిచేసినకృత్యముదహించుటకు♦మనతరమాయనుచు
హరికృపతోఁదయ్యెనటంచు
ఇదిశ్రీహరిమహాత్త్వమంచు
హరిదాసులకీవరభోగంబులు♦నరకసమంబనియు
నృపవర్యుఁడువిరక్తుఁడయ్యె
63 తనతోసమానంబుగవెలిగెడితన♦తనయులరావించి
ధరణీభరముఁదాల్పఁబంచి
తనుకాననముప్రవేశించి
కామవర్జితుండైహరితుల్యుం♦డై మెల్లఁరిగాంచె
దనకీర్తినిసురలగ్గించా
64 యీకథచదివినవినినవారికిని♦నిలయుడుఫులపాటి
హరిభక్తుండాపిసుపాటి
నారాయణకవిమదినాటి
బ్రోచెడిశ్రీచెన్నకేశుడవ్వాడు♦బ్రోచును వారలను
బాపియుభవబంధంబులను

గద్య

ఇది శ్రీభారద్వాజ సగోత్రపవిత్ర పిసుపాటాన్వయ ప
యోదధికైరవమిత్ర శ్రీ ఆర్యాసహాయ చరణకమ
లసేవాదురంధరలక్ష్మయామాత్యపౌత్ర పున్న
యార్యచతుర్థపుత్ర నారాయణకవిప్రణీతం
బైన అంబరీషోపాఖ్యానము మహార్ణవమి
పద్యములు
సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

